## అధ్యాయము - 6

# గురుమహరాజ్ తాజుద్దీన్

దైవత్వ ప్రతిభకంతటికీ ప్రత్యక్షులు పూర్ణజ్ఞానాన్ని పొందిన మహాత్ములే ! వారి జీవితాలు పవిత్ర మత గ్రంథాలలో చెప్పబడిన ధార్మిక జీవనాన్ని ప్రతిబింబిం చేటట్లు వుంటాయి. మానవ స్వభావాలలో గల సహజమైన వక్రతవలన మనుష లంతా అతి తేలికగా అర్థమయ్యే ఆధ్యాత్మిక బోధనలను కూడా అపార్థం చేసుకుని, మొండి వైఖరితో వాటి పైననే ఆధారపడి ఆచరణలో కూడా చెడ్డమార్గం పడు తున్నారు. సత్యస్వరూపమైన దైవత్వం పొందడానికి దేవుని పట్ల సంపూర్ణ శరణా గతి మరియు ఆయన స్వరూపమే అయిన సమస్త జీవరాశిపట్ల నిర్మలమైన ప్రేమ, స్వచ్ఛమైన ధార్మిక జీవనాన్ని గడపటమూ ఆచరించక తప్పదని అన్ని మతాలూ బోధించి వున్నాయి. అయితే దైవం యందు కపటమైన ప్రేమను కన పర్చటము, తోటి జీవులపైన కక్షలు పూనడము, పతితమైన జీవితాన్ని గడపడమూ వంటి హీనస్థితికి దిగజారకుండా వున్న మతాలు చాలా అరుదు. మతాలు అలా కలుషితమైనపుడు ప్రజల అభిప్రాయాలను సవరించి వీలైనంత ఎక్కువ మంది ప్రజలను మళ్ళీ సన్మార్గానికి మళ్ళించడానికి మహాత్ములు మన మధ్య వుండటం ఎంతైనా అవసరం. మతం అటువంటి మహాత్ములయందే నివసిస్తుంది. వారి భుజస్కందాలమీదే నిలబడుతుంది.

తాజుద్దీన్ సర్కార్ ఇస్లాం మతంలోని ప్రథమశ్రేణిలోని మహాత్ములలో ఒకరు. ఆయన లక్షా ఇరవై అయిదు వేల (1,25,000) మందిని తనంతటి మహాత్ము లుగా చేశాకనే జగత్తుతో తనకు గల సంబంధాన్ని తెంచుకుంటానని ప్రకటించి, తాము దయాగుణానికే మూల స్తంభమువంటివాడు అని నిరూపించుకున్నారు. మహాత్ములకు మృత్యువు లేనేలేదని, వారు చిరంజీవులని మనకందరకూ తెలుసు. వారి సమాధులలోని మట్టి సహితమూ సత్యాన్వేషకులకు ఉపదేశాలను, ప్రోత్సా హాన్ని ఇవ్వగల్గినంతటి ఆధ్యాత్మిక శక్తి కల్గి ఉంటుంది. దీని వలన 1,25,000 మంది మహాత్ములు తయారయ్యే వరకు తాజుద్దీన్ సమాధి అటువంటి ఆధ్యాత్మిక శక్తి కలిగి వుంటుందని మనం గుర్తించాలి.

ఒక మనిషిని మహాత్ముడుగా తీర్చిదిద్దడం అంటే మాటలు కాదు. సామాన్యమైన ఆధ్యాత్మిక ప్రబోధనల ద్వారా వారిలో దైవం పట్ల విశ్వాసాన్ని కలుగజేయవచ్చు. అయితే లౌకిక కట్టుబాట్లను అధిగమించి జీవితాలను సత్యాన్వేషణకు అంకితం చేయడానికి సద్గురువు యొక్క పూర్తి రక్షణ అవసరం ! అటువంటి సద్గురువే తాజుద్దీన్ బాబా కూడా. అటువంటి రక్షణను తన భక్తులకు, మానవ సంఘానికి ఆయన ఎలా కల్గించారో చదవడం కుతూహలంగా ఉంటుంది.

అబ్దుల్ అజీజ్ అనే ఆయన సద్గురువు కోసం అన్వేషణ సాగిస్తున్నారు. అనేక మంది పీర్లు ఆయనను తమ భక్త కోటిలో చేర్చుకోవడానికి ప్రయత్నించారు. అయితే అబ్దుల్ అజీజ్‌కు మాత్రం వారి యందు గురుత్వ భావమేర్పడలేదు. ఒకరోజు ఆయనకు కలలో ఒక మహాత్ముడు దర్శనమిచ్చారు. మరునాడు ఉదయం తన కలలోని మహాత్ముని వర్ణించి తన మిత్రులతో చెప్పాడు అబ్దుల్ అజీజ్. అందులో ఒక మిత్రుడు అబ్దుల్ అజీజ్ చెప్పిన మహాత్ముడు తాజుద్దీన్ బాబాను పోలి వున్నాడని చెప్పి బాబా పిచ్చాసుపత్రిలో వుండగానూ, సకర్దరాలో వుండగానూ కనపరచిన అద్భుత లీలలను గూర్చి అతనితోచెప్పాడు. ఇది విన్న అజీజ్‌కు తాజుద్దీన్ బాబాను దర్శించాలన్న కోరిక గాఢమై 1908లో అతను వాకీలో బాబాను దర్శించాడు. అజీజ్ వాకీ వచ్చినపుడు తాజుద్దీన్ బాబా చెట్టు క్రింద కూర్చుని వున్నారు. అజీజ్‌ను చూస్తూనే తాజుద్దీన్ బాబా నేలమీదనుండే గడ్డిపరకనొకదానిని తీసికొని దానితో తన కఫ్నీ అంచుమీద అబ్దుల్ పూర్తి పేరు వ్రాసి అతనిని చూచి చిరునవ్వులొలికించారు. తన పూర్తి పేరు బాబాకెలా తెలిసిందా అని అజీజ్ ఆశ్చర్యపోయాడు. ఈ సంఘటన అతనిలో సహజమైన నమ్మకాన్ని కలిగించింది. అజీజ్, వాకీలో బాబా సన్నిధిలో చాలా రోజులు గడిపాడు. ఆ కాలంలో ఇతడు తాజుద్దీన్ బాబా తన పేరును ఆయన కఫ్నీ అంచుమీద వ్రాసుకుని తనను ఆయన బిడ్డగా అంగీకరించి, తన రక్షణ భారాన్నంతా ఆయనే వహించదలచారని అర్థం చేసుకున్నాడు. రోజులు గడచిన కొద్దీ అటువంటి అజీజ్ నమ్మకం యింకా యింకా దృఢతరం కాజొచ్చింది.

తాజుద్దీన్ బాబాకు అప్పుడప్పుడు కల్గే దివ్యానుభూతుల వలన ఒక్కొక్కప్పుడు తీవ్రమైన కోపంతో భక్తులను కొట్టేవారు గూడా. అయితే అది ఒక రకమైన

ఆశీర్వాదమనే సంగతి భక్తులు గ్రహించేవారు. బాబా అటువంటి తీవ్రధోరణిలో ఉన్నప్పుడు భక్తులంతా సచ్ఛీల అయిన 'మరియంబి అమ్మాసాహెబ్' అనే ఆమెను బాబా దగ్గరగా పంపించేవారు. ఆమెను చూడగానే తాజుద్దీన్ బాబా కోపమంతా చల్లారి శాంతపడేవారు. అటువంటి తాజుద్దీన్ బాబా అనుభూతులను ఒకసారి అజీజ్ కూడా తిలకించాడు. ఒకసారి తాజుద్దీన్ బాబా చాలా కోపంగా వున్నారు. ఆయన ముఖం అంతా వింత అయిన కాంతిని వెదజల్లుతు న్నది. మామూలుగా భక్తులు అమ్మాసాహెబ్‌ను ఆయన ఎదురుగా పంపించారు. ఈసారి ఆమెను చూచినాగూడా శాంతించక ఆమెను పట్టుకు బాదసాగారు. కొద్దిక్షణాల తరువాత ఆయన శాంతించి, నేరుగా వెళ్ళి అజీజ్ చేతిని తన చేతిలోకి తీసికొని ఒక ద్విపదను ఇలా చదివారు !

"నీ దగ్గరకు వచ్చి నీ భక్తులైనవారు దైవానికే భక్తులవుతారు. అటువంటి భక్తుని చేతి మీద భగవంతుని చేయి ఎప్పుడూ ఉంటుంది. రాబోయే రోజులలో కూడా చేయి అలానే ఉంటుంది. ఈ రోజు ఉపదేశం పొందిన వ్యక్తి కూడ నీ భక్తుడే. నీదైన యీ షేక్ చేయి కూడా ఆ దయామయుడే !"

అలా ద్విపద చదివి అజీజ్‌ను తన భక్తునిగా అంగీకరించి తాజుద్దీన్ బాబా అతని పేరు 'నశీరుద్దీన్' గా మార్చారు. 'నశీరుద్దీన్' తరువాత బాబా సన్నిధిలో చాలా కాలం నివసించాడు. తరువాత అతను కూడ తాజుద్దీన్ బాబా యంతటి మహాత్ముడైనాడు.

ఒకరోజు ఉదయం తాజుద్దీన్ బాబా సకర్దరాలో ముఖద్వారం వద్ద కూర్చొని వున్నారు.ఆ సమయంలో ఆయన పొడుగాటి కోటు వేసుకొని వున్నారు. అది తెల్లవారుజామున 5 గంటల సమయం. కరీంబాబా అనే భక్తుడు ఆ సమయంలో బాబా దగ్గరకు వెళ్ళి నమస్కరించాడు. అప్పుడు తాజుద్దీన్ బాబా కరీంను యిలా అడిగారు : "నేను యిప్పుడు ఎలా కనిపిస్తున్నాను?" అని "దైవ వర్చస్సుతో మీరు వెలిగిపోతున్నారు" అన్నాడు కరీం బాబా. అప్పుడు తాజుద్దీన్ బాబా తను తొడుక్కున్న కోటును విప్పేసి, దిగంబరంగా నిల్చుని, "ఇప్పుడు నేనెలా కనిపిస్తు న్నాను?" అని మళ్ళీ అడిగారు. కరీంబాబా మళ్ళీ, "దైవ సామ్రాజ్యపు ఠీవితో మీరు వెలిగిపోతున్నారు" అన్నాడు. అప్పుడు బాబా తన చొక్కా చేతులను కరీం

బాబా చేతికిచ్చి, "గట్టిగా పట్టుకో ! ఇహపరాల గురించి నువ్వు భయపడనవసరం లేదు" అంటూ తన దుస్తులను కరీంబాబా తలచుట్టూ చుట్టారు. తర్వాత ఆయన కరీం బాబా చేతిలో కొన్ని మధురపదార్థాలను పెడుతూ, "ఇది వివాహ సమయంలో యిచ్చే కానుక" అన్నారు. అందుచేత తాజుద్దీన్ బాబా భక్తులందరిలోకి కరీంబాబాకు ప్రత్యేక స్థానం వుంది.

ఫతే మహమ్మద్ అనే ఆయనను మహాత్ముడుగా తీర్చిదిద్దిన తాజుద్దీన్ బాబా లీల యింకా అద్భుతమైనది. ఫతే మహమ్మద్ షా అఫ్ఘనిస్తాన్ నుండి భారతదేశం వచ్చి, మోతమల్ జిల్లాలోని ధార్వా అనే గ్రామంలోని మశీదులో నివశించేవాడు. అతడు రాత్రింబవళ్ళూ ధ్యానంలో మునిగి చిత్రమైన సమాధిలో వుండిపోయేవాడు. తాజుద్దీన్ బాబానే ఆయనను ధార్వా గ్రామానికి పంపించారని చెప్పుకుంటారు. ధార్వా గ్రామానికి చేరకముందు ఫతే మహమ్మద్ షా తాజుద్దీన్ బాబాను నాగపూర్ పిచ్చాసుపత్రిలో కలుసుకున్నారు. ఆ సమయంలో తాజుద్దీన్ బాబా తను వుండే జైలు గది గురించి యిలా అన్నారు : "ఈ గది ఎప్పటికీ ఖాళీగా వుండదు" అని. ఆ మాటలు అక్షరాలా నిజమయినాయి. తాజుద్దీన్ బాబా పిచ్చాసుపత్రిని వదిలి వచ్చినప్పుడు తాముున్న గదిలో ఫతేషాను వుంచారు. ఫతేషా కూడ తర్వాత గొప్ప మహాత్ముడైనాడు. తాజుద్దీన్ బాబా సమాధి చెందాక మహారాజు రఘోజీరావు ఫతేషాను పిచ్చాసుపత్రినుంచి విడుదల చేయించి సక్కర్దరాలో తాజుద్దీన్ బాబా స్థానంలో వుండమని ప్రార్థించాడు. అప్పుడు ఫతేషా యిలా సమాధానమిచ్చారు : "ఆ ప్రదేశము మనము శిరస్సున ధరించవలసినట్టిది. మీరు నన్ను అప్పుడే అక్కడకు తీసుకు వెళ్ళదలచారా !" అన్నారు. తాజుద్దీన్ బాబా నివసించిన ఆ ప్రదేశము ఎంతో పవిత్రమైనదని, మన కాళ్ళతో త్రొక్కి దానిని అపవిత్రపరిస్తే పాపం చుట్టుకుంటుందని ఆయన భావం. ఫతేషా నిర్యాణం వరకూ పిచ్చాసుపత్రిలో ఆ 'గది' లోనే వున్నారు. అక్కడ ఆయన నిర్యాణం చెందాక ఆయన శరీరాన్ని తాజుద్దీన్ బాబా సమాధి వున్న 'తాజాబాద్' కు తెచ్చారు. ఫతేషా యింతకు ముందు తాజాబాద్ గురించి అన్న మాటలు ఆయన శరీరాన్ని తలల మీద మోసుకొని తాజాబాద్‌కు తీసుకురావడం గురించి చెప్పిన సూచనగా మనం తీసుకోవచ్చు. లేదా తాజుద్దీన్ బాబా అందుకున్న మహోన్నత ఆధ్యాత్మిక స్థితిని

శరీరాలు నిలచి వున్నంత కాలం ఎవరూ అందుకోజాలరని సూచించి వుండవచ్చు.

హిజాముద్దీన్ అనే ఆయన తన యింటి వద్ద తానుండగానే తాజుద్దీన్ బాబా తనను శిష్యుడిగా చేసుకోవాలని ఒకసారి అనుకున్నాడు. ఆ రోజునే అతనికి తాజుద్దీన్ బాబా స్వప్న దర్శనమిచ్చారు. ఆ కలలో తాజుద్దీన్ బాబా ఒక చెరువు ఒడ్డున కూర్చొని, తమ కాళ్ళు కడుగుకుంటున్నారు. ముస్లిములందరూ నమాజ్ చేయబోయే ముందు అలాగే కాళ్ళు కడుక్కుంటారు. ఆయన కాళ్ళు ముంచిన చోటల్లా అక్కడి నీరు వింత కాంతితో ప్రకాశిస్తున్నాయి. మరునాడు ఉదయమంతా హిజాముద్దీన్ ఆ కలను బాగా వితర్కించుకొని చివరకు తాజుద్దీన్ బాబా తనను ఆయన శిష్యుడిగా అంగీకరించారని, యిదే ఆ కల అర్థమనీ నిర్ణయించుకున్నాడు. అయినా కూడా హిజాముద్దీన్ ఆ రోజున తాజుద్దీన్ బాబాను దర్శించి తన కోరికను బాబాకు కూడా తెలియజేశాడు. వెంటనే తాజుద్దీన్ బాబా, "రాత్రి మనం కలుసుకున్నాం కదా ! అది సరిపోలేదా ?" అన్నారు. హిజాముద్దీన్ ఆశ్చర్యపోయాడు. సంతోషంతో పుక్కిరిబిక్కిరయ్యాడు. ఆ సంతోషంతోనే హిజాముద్దీన్ మనసులో "ఇప్పుడు మీరు నన్ను శిష్యునిగా అంగీకరించారు. కనుక నాకు నిదర్శనమేమైనా చూపించవలసినది" అని ప్రార్థించాడు. అదతలా భావన చేసిన మరుక్షణమే తాజుద్దీన్ బాబా అతనివైపు తిరిగి,"నీకు నిదర్శనం కావాలా ? ఆ పని కాజా హసన్ నిజామీ చేస్తాడు" అన్నారు.

సూఫీ మహాత్ముడైనా కాజా ముద్దీన్ చిస్తీ గారి గద్దెకు వారసులైన కాజా నిజామీ గారు గొప్ప మహాత్ములు. వారి నివాసం ఢిల్లీ నగరం. తాజుద్దీన్ బాబా ఆధ్యాత్మికంగా కాజా నిజామీగారితో సంబంధం కలిగి వున్నారని తలచి హిజాముద్దీన్ విభ్రాంతి చెందాడు. మరుక్షణమే అతని మనసులో ఒక సందేహం స్ఫురించింది. "తాజుద్దీన్ బాబా నన్ను హజరత్ నిజామీ దగ్గరకు పంపుతున్నారే! నిజామీ గారు కూడ తాజుద్దీన్ బాబా అంతటి మహాత్ములేనా ? కాదా?" అని. అందుచేత హజరత్ నిజామీగారిని పరీక్షించదలచాడు. వెంటనే నిజామీగారికి ఏమీ అర్థం కాని విధంగా,"మీ శిష్యరికం చేయమని నాకు ఆదేశం వచ్చింది. నన్ను మీ దగ్గరకు ఎప్పుడు రమ్మంటారో తెలియజేయవలసింది" అని వ్రాసి తన సంతకంగానీ, అడ్రస్‌గాని వ్రాయకుండా నిజామీగారికి ఉత్తరం పంపించాడు.

హిజాముద్దీన్ యిట్లా వ్రాసినా కూడా కొన్ని రోజుల తరువాత నిజామీ గారి దగ్గర నుండి సమాధానమొచ్చింది. ఆ సమాధానం యిలా వుంది. "హిజాముద్దీన్! తాజుద్దీన్ బాబా ఆజ్ఞానుసారంగా నువ్వు యిక్కడకు రావలసింది. హజరత్ నిజాముద్దీన్ గారి నెలసరి ఉత్సవం ప్రతినెలా 17వ తేదీన జరుగుతుంది. ఆ రోజున నువ్వు వచ్చి దీక్ష తీసుకోవలసింది".

ఈ జాబు నిజాముద్దీన్ యొక్క సర్వజ్ఞత్వాన్ని, ఆయనకు తాజుద్దీన్ బాబాతో గల సన్నిహితత్వాన్ని గూడ తెలియజేసింది. హిజాముద్దీన్ వెంటనే ఢిల్లీ వెళ్ళారు. అతడు నిజాముద్దీన్ గారి దర్గాలో ప్రవేశించగానే ఎవరూ అతనిని పరిచయం చేయకుండానే, అప్పుడు ఆ దర్గాకు వారసుడైన నిజాముద్దీన్ అతనిని పేరు పెట్టి పిలిచి, "హిజముద్దీన్, వచ్చావా ? రేపు ఉదయం ఉపదేశం తీసుకో!" అన్నారు. ఆ మరుసటిరోజే హిజాముద్దీన్ నిజాముద్దీన్ గారి ఉపదేశం పొందాడు.

విజయనగరానికి చెందిన ప్రఖ్యాత మహాత్ముడు ఖాదర్ వలీబాబా, హజరత్ తాజుద్దీన్ బాబా శిష్యులలో ఒకరు. తిరుచునాపల్లి రాజవంశానికి చెందినవారైన అతని తల్లిదండ్రులు విజయనగరంలో స్థిరపడ్డారు. వారు దైవభక్తులు, ఖాదర్ పినతండ్రి గూడ విశాఖపట్టణంలో గొప్ప మహిమలు గల ఫకీరుగా ప్రఖ్యాతి చెందారని ప్రజలు చెప్పుకుంటారు. ఖాదర్ షా 1900 సంవత్సరంలో జన్మించారు. బాల్యం నుంచీ కూడ ఖాదర్ దైవరక్షణలో వున్నట్లుండేవారు. భయంకరమైన త్రాచుపాము మొదలు క్రూరమృగాలనుండి గూడ అనేక సార్లు అతడు అద్భుత రీతిన రక్షింపబడ్డాడు. ఉదాహరణకు – ఒకసారితడు ఒక యింట్లో పడుకుని వున్నాడు. ఆ సమయంలో చుట్టూ వున్న యిండ్లన్నీ తగులబడినా అతడు పడుకొని వున్న యిల్లు మాత్రం కొంచెం గూడ అంటుకోలేదు ! మరొక విశేషమేమంటే అతనిపై ఎవరు కోపగించుకున్నా వారు వెంటనే ఏదో విధంగా శిక్షింపబడేవారు.

బాల్యంలోనే అతడు సాధుసత్పురుషుల చరిత్రలపట్ల ఎంతో ఆసక్తి కలిగి వుండేవాడు. హైస్కూలులో చదువుతున్నప్పుడే అతనికి ఈ పొట్టకూటి చదువుల పట్ల విముఖత కలిగింది. మానవుని జీవిత పరమార్థం. ఆధ్యాత్మిక వికాసమేనని అప్పుడే అతడు గ్రహించాడు. అప్పటి నుండి అతడు ఆటల యందు, స్కూలు పుస్తకాల యందు, బంధుమిత్రాదులయందు అనాసక్తి కలిగివుండేవాడు. తన

సమయాన్నంతా, "ఆధ్యాత్మిక పరిపూర్ణత చెందడానికి మార్గాలేమిటి?" అనే విషయం గూర్చే ఆలోచిస్తుండేవాడు. ఖాదర్ తండ్రిగూడ దైవభక్తిగలవాడే గనుక అతని మనసుని అర్థం చేసుకొని అతనినేమీ అటంకపరచలేదు.

కొన్ని సంవత్సరాల తర్వాత, అభివృద్ధి చెందుతున్న ఒక కంపెనీవారు ఖాదర్‌కు మంచి ఉద్యోగం యిస్తామని అతనిని తమ వైపు త్రిప్పుకోజూచారు. అప్పుడు ఖాదర్ తండ్రి అతని మార్గమదికాదని చెప్పి, అతని మార్గము, గమ్యముల గురించి గుర్తు చేసారు. తర్వాత ఒక రోజు ఖాదర్ తండ్రి అయిదు రాగి నాణాలు అయిదుగురు సాధువులకివ్వమనీ ఆ విధంగాచేసి తాను తాజుద్దీన్ బాబాకు చెప్పుకున్న మొక్కును తీర్చమనీ ఖాదర్‌తో చెప్పి, "నేను ఈ రోజుసాయంత్రం వెళ్ళిపోతున్నాను. జాగ్రత్తగా వుండు" అని కూడ చెప్పాడు. తాను చెప్పినట్లే ఆ పరమభక్తుడైన ఖాదర్ తండ్రి ఆ సాయంత్రం ప్రశాంతంగా కన్ను మూసాడు.

అప్పటి నుండి ఖాదర్ షా హృదయం ఒక పరిపూర్ణ మహాత్ముని కోసం వ్యథ పడసాగింది. ఇప్పటి వరకు ఖాదర్ షా సమాజంలో లెక్కలేనంతమంది గొప్ప ఆధ్యాత్మికవేత్తలుగా నటించే కపట గురువులను చూచి చూచి తనకు సమర్థుడైన గురువు లభిస్తాడా లేదా అని కలవరపడసాగాడు. ఇలా వుండగా ఒకసారి తాజుద్దీన్ బాబా భక్తుడైన హజరత్ బాబా తన గురువు యొక్క ప్రేమపూరితమైన సందేశాన్ని ప్రజలలో వ్యాప్తి చేయడానికి విజయనగరానికి వచ్చారు. ఖాదర్ బాబా ఆయన సందేశాన్ని విని అనతి కాలంలోనే నాగపూర్‌ను దర్శించాడు.

మొదటిగా తాజుద్దీన్ బాబాను చూచినప్పుడు తన దర్శనానికి వచ్చిన ప్రజలను ఉచ్చరించరాని చెడ్డ తిట్లు తిడుతూ దిగంబరుడుగా వున్న యీ పిచ్చి ఫకీరు ఆధ్యాత్మిక సామ్రాజ్యానికి అధినేత ఎలా అవుతాడు ! అనుకున్నాడు ఖాదర్. అప్పుడు తాజుద్దీన్ బాబా గుఱ్ఱబ్బండిని ఎక్కి బండి వెంటబడుతున్న జనాన్ని బండతిట్లు తిడుతూ బండి తోలుకుంటూ వెళ్ళారు. ఖాదర్ షా కాలకృత్యాలు తీర్చుకొనడానికి, తన అనుష్ఠానం పూర్తి చేసుకోడానికీ వెనుకనే ఆగిపోయాడు. ఖాదర్ షా తను వెళ్ళదలచుకున్న ప్రదేశానికి నడిచి వెళుతూ వుండగా హఠాత్తుగా తాజుద్దీన్ బాబా ఆయన ముందు ప్రత్యక్షమై, "ఏమిటి నీ

సందేహం ? ఇలా అపార్థం చేసుకున్నావెందుకు ? ఎటువంటి సందేహానికీ యిక్కడ తావులేదు" అంటూ నిశ్చేష్టుడైన ఖాదర్ స్పృహలోకి వచ్చేటంతటిలోనే అద్భుతరీతిన మాయమయ్యారు.

మరునాడు ఉదయం ఖాదర్ షా హజరత్ బాబా యింకా కొందరు భక్తులూ తాజుద్దీన్ బాబా చుట్టూరా కూర్చొని వున్నారు. తాజుద్దీన్ బాబా హజరత్ బాబా వైపు తిరిగి, "ఆ మెత్తనైన అంగికి కొన్ని కుట్లు వేసిరా" అని ఆజ్ఞాపించారు. గురువు ఆజ్ఞను పాటించడానికి హజరత్ బాబా అక్కడ నుండి లేచి బయటకు వెళ్ళారు. ఖాదర్ కూడా హజరత్ బాబాను అనుసరించి వెళ్ళి ఆయనతో "బాబా ఆజ్ఞలో గూఢార్థం వున్నది. కొద్దిసేపట్లో అంగీలాగా సున్నితంగా వుండే ఒక ధనవంతుడు యిక్కడకు రాబోతాడని అతనికి ఎదురువెళ్ళి అతనికి వివేకం కల్గేటట్లు కొన్ని మాటలు చెప్పమనీ ఆయన భావం" అని చెప్పాడు. ఇది విన్న హజరత్ బాబాకు తన గురువు చెప్పిన మాటలనూ ఖాదర్ బాబా చెప్పిన వాక్యాన్నీ సమన్వయపరచుకోవడం ఎలాగో అర్థం కాలేదు. అయితే కాసేపటికి విలువైన కారులో కూర్చొని ఒక ధనికుడు రానే వచ్చాడు. ఆయన వెంట పళ్లెంలో అపురూపమైన కానుకలను తెచ్చారు. వాటిని హజరత్ బాబా అందుకొని తాజుద్దీన్ బాబా వద్దకు తీసుకురాగానే తాజుద్దీన్ బాబా అతనితో, 'విజయనగరం నుంచి వచ్చిన వాడు వివరించి చెప్పనిదే నీవేమీ అర్థం చేసుకోలేవా !" అని ప్రశ్నించారు.

తాజుద్దీన్ బాబా భక్తులలో జబల్‌పూర్ బాబా కూడ ఒకరు. చిన్నప్పటి నుంచి ఆయన శాంతమే మూర్తీభవించి వున్నదా అన్నట్లు వుండేవాడు ! ఒకరోజున శ్రద్ధాళువులైన కొంతమందికి జ్ఞానబోధ చేస్తుండగా ఒక మూలన వింటూ కూర్చున్న యువకుడైన ఖాదర్ మీద ఆయన దృష్టి పడింది. వెంటనే జబల్‌పూర్ బాబా పారవశ్యంలో ఖాదర్‌కు అణకువతో నమస్కరిస్తూ, "ఓ మహాత్మా! నీ శక్తిని నాకు చూపించు" అంటూ గొణగసాగారు.

గందరగోళంగా వున్న ఈ సన్నివేశాన్ని చూచిన ఖాదర్ విభ్రాంతితో అక్కడ నుండి వెళ్ళిపోయాడు. తర్వాత ఆ భక్తులంతా తాజుద్దీన్ బాబా దగ్గరకు వెళ్ళారు. అప్పుడాయన జబల్‌పూర్ బాబాతో, "నా శక్తిని నీవు చూడాలనుకుంటున్నావా? నా ఆధ్యాత్మిక శక్తిని నీవు సందేహిస్తున్నావా"? అని అడిగారు. అప్పుడందరూ

యువకుడైన ఖాదర్ షా, తామూ ఒక్కరేనని తాజుద్దీన్ బాబా చెప్పారని గుర్తించారు.

మరొక సందర్భంలో హజరత్ బాబా, ఖాదర్ బాబాను పిలిచి వంటకు ఉపయోగపడేలా కట్టెలు కొట్టవలసినదిగా కోరారు. ఖాదర్ బాబా ఆయన మాటలు శిరసావహించారు. అయితే ఖాదర్ బాబాకు కట్టెలు కొట్టడం ఎప్పుడూ అలవాటు లేకపోవడంతో ఆయన చేతులు పుండ్లు పడ్డాయి. తర్వాత హజరత్ బాబా హుజూర్ బాబాకు ఎదురు పడ్డప్పుడు ఆయన కోపంగా, "ఓరీ మూర్ఖుడా ! నా చేతులు చూడు, ఎలా పుండ్లు పడ్డాయో ! నీవు నా చేత కట్టెలు కొట్టిస్తావా !" అన్నారు.

మనకు ఆశ్చర్యం కొల్పే విషయమేమిటంటే ఖాదర్ నాగపూర్ వచ్చి మూడు రోజులైనా ఆయన తాజుద్దీన్ బాబాతో ఒక్కమాటైనా మాట్లాడలేదు. నాల్గవరోజు తెల్లవారు జామున ఖాదర్‌కు ఒక కల వచ్చింది. ఆ కలలో అతనికి పెద్ద భోషాణాలు రెండు కనిపించాయి. వాటి తాళం చేతులను ఎవరో అతని చేతికి యిచ్చారు. వాటితో ఆయన ఆ రెండు భోషాణాలను తెరచి చూచారు. వాటిలో ఒక దాంట్లో నిండుగాను, రెండవదాంట్లో సగానికీ పవిత్రమైన గ్రంథాలు వున్నాయి. ఈ కల పూర్తయి ఖాదర్ నిద్ర నుండీ లేవగానే అతని ప్రక్కనే తాజుద్దీన్ బాబా నిలబడి దర్శనమిచ్చారు. ఆ ప్రదేశాన్నంతా చిమ్ముతున్న ఒక వృద్ధ స్త్రీ కూడా తాజుద్దీన్ బాబా అక్కడ నిలబడి వుండడం చూచి అక్కడ నిద్రపోతున్న మిగతా భక్తులందరినీ నిద్ర లేపింది. అంతలోనే తాజుద్దీన్ బాబా అదృశ్యులై పోయారు. తర్వాత తనకు కల్గిన అనుభవాన్ని ఖాదర్‌బాబా అమాయకంగా హజరత్ బాబాతో చెప్పినప్పుడు తాజుద్దీన్ బాబా ఖాదర్ బాబాతో యిలా అన్నారు : "బాబా యిటువంటి అనుభవాలను నీవు యితరులతో ఎప్పుడూ చెప్పరాదు. అయినా యిప్పుడు నీకేం భయంలేదు" అంటూ చిరునవ్వుతో ఆశీర్వదించారు.

త్వరలోనే ఖాదర్ షా విజయనగరానికి తిరిగి వెళ్ళి అక్కడ తీవ్రమైన ఆధ్యాత్మిక సాధనలలో తన కాలాన్నంతా వెచ్చించసాగాడు. ఆయన సాధనలు శీఘ్రంగానే ఫలించి ఆయన గూ॥ గొప్ప మహాత్ములయినారు.

అసంఖ్యాక జనవాహిని లౌకిక, ఆధ్యాత్మిక సమస్యల పరిష్కారానికోసం ఖాదర్ బాబా దగ్గరకు పరుగులిడేవారు. ఖాదర్ బాబా సమాధి చెందిన తర్వాత భక్తులు ఆయన ఆశీర్వచనాన్ని నేటికీ కూడ పొందుతూనే వున్నారు. బాబా ఖాదర్‌వలీ మానవాళికై తాజుద్దీన్ బాబా వెలిగించి యిచ్చిన ఒక జ్యోతి. తన గురువంతటి వాడైన బాబా ఖాదర్‌వలీ కూడ తనంతటి శిష్యులను ఎందరినో తయారుచేశాడు.

## అధ్యాయము - 7

## మృత్యుంజయుడు

మానవజాతిని పాపం నుంచి, దాని ఫలితమైన మృత్యువు నుంచి రక్షించ డానికే తానవతరించానన్న జీసస్ క్రీస్తు, మృత్యువు, వృద్ధాప్యము, రోగముల బారిన పడకుండా బైటపడే మార్గాన్ని అన్వేషిస్తానని ప్రతిజ్ఞ చేసిన బుద్ధుడు కూడ అందరి మానవులలాగే మృత్యువాతబడ్డారు కదా ! మరి వారు చేసిన ప్రతిజ్ఞలనూ ఎలా నెరవేర్చుతున్నట్లు ? అనే అనుమానం సామాన్య మానవులకు కలుగవచ్చు. ప్రవక్తలయొక్క, మహాత్ముల యొక్క జీవితాలు సామాన్య జనుల జీవితాలవలె గాక అందుకు భిన్నంగా వుంటాయని, వారికసలు మృత్యువనేదే లేదని, వారు శాశ్వతమైన ఆధ్యాత్మిక స్థితిలో యెప్పుడూ జీవించే వుంటారనీ సమాధానం చెప్పినపుడు సామాన్య జనులకు నమ్మడం కష్టంగానే వుంటుంది. ఇటువంటి మన నమ్మకాన్ని చూచి నాగరికులు తరచుగా "నవ్వుతూ" వుంటారు. అదృష్టవశాత్తు నవ్వు నిజాన్ని వమ్ము చేయలేకపోగా, అవివేకాన్నే వ్యక్తపరుస్తుంది.

ఏమైనప్పటికీ యీ ప్రవక్తలు, దైవాంశ సంభూతులూ తమ శిష్యులను దైవ న్యాయాన్ననుసరించి నడువవలసిన ఆధ్యాత్మిక క్రమశిక్షణా రీతులను యేర్పర చారు. ఆ పద్ధతులను అనుసరించినట్లయితే ప్రతి వ్యక్తి తామందుకున్న ఉన్నత శిఖరాలను చేరుకుంటాడని, పూర్ణ జ్ఞానాన్ని పొందుతాడనీ ప్రవచించారు. పవిత్ర హిందూ మత గ్రంథాలలో హిందూ ఋషులు క్షుణ్ణంగా వివరించిన వివిధ రకాలైన యోగమార్గాలు, బుద్ధుడు ప్రవచించిన అష్టాంగ మార్గము, జీసస్ క్రీస్తు

చెప్పిన (Sermon on the mount) ధర్మోపదేశాలు, ఇస్లాం మతంలోని అద్భుతమైన సిద్ధాంతరీతులు ఇవన్నీ మానవులను శాశ్వత ఆనంద పదవికి తీసుకుపోయే జీవన విధానాలే.

ఈ ప్రవక్తలు, మహా పురుషులు సామాన్య మానవుల మధ్య జీవించినప్పటికీ ఆ భగవంతుని కృప వలన, వారికి వారు విధించుకున్న అత్యుత్తమ క్రమశిక్షణ వలన, జాతి యందు తమకు గల అవధులు లేని కరుణ వలనా తమను తాము మహాత్ములుగా మలచుకున్నారు. వారు చెప్పినదంతా సత్యమేననడానికి, మానవుడిలో మహాత్ముడు కాగల శక్తి సామర్థ్యాలు పూర్ణంగా వున్నాయనడానికి వారి జీవితాలే మనకు సాక్ష్యాధారాలు. జీసస్ క్రీస్తు, "స్వర్గ సామ్రాజ్యము నీలోనే ఉన్నది", "స్వర్గ సామ్రాజ్యాన్ని అన్వేషించు" "స్వర్గంలోని నీ తండ్రివలె నిర్మలుడవై యుండు" అని మనకు చెప్పినపుడు పామరులమైన మనము దృఢమైన నమ్మకముతో పట్టుబట్టి కృషి చేస్తే ఆయన స్థితినే మనమూ పొందగలమనీ,ఆయన వాక్యాలనే మనమూ బోధిస్తామనీ ఆయన ఎరిగే వున్నారు. కాని జనబాహుళ్యం తాము ఆచరించవలసిన ధర్మాలను ఉల్లంఘించడానికి బుద్ధుడు, క్రీస్తు మొదలైన వారు అవతారపురుషులని, కనుకనే వారు ఆ స్థితిని పొందారని అజ్ఞులమైన మనము అటువంటి స్థితిని పొందడం అసాధ్యమనీ సాకు చెప్పుకుంటున్నారు. ఆ విధంగా జనబాహుళ్యం పెడమార్గాన పడి అంధత్వం చేత, నిర్లక్ష్య వైఖరి చేత దైవం మనకిచ్చిన వెలలేని కానుకలను పోగొట్టుకుంటామనే వుద్దేశ్యంతోనే మళ్ళీ మళ్ళీ మహాత్ములు మన మధ్య అవతరించి మన కళ్ళు తెరిపిస్తూ వుంటారు. వారు సక్రమంగా క్రమశిక్షణను పాటించి తమ నడవడికలో అన్ని విధాలుగా ప్రవక్తలను పోలి వుంటూ మిగతా ప్రజలను కూడా తమ వలె ఆచరించడానికి ప్రోత్సహిస్తారు.

హజరత్ బాబా తాజుద్దీన్ ఔలియా అటువంటి గొప్ప మహాత్ములలో ఒకరు. వారు జీవించివున్నప్పుడు ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని ఋజువు చేయడమే గాక సమాధి చెందిన తరువాత కూడ జిజ్ఞాస గల భక్తులకు పిలిచిందే తడవుగా పలుకుతూ ఒక్కొక్కసారి భౌతిక రూపంతోనే దర్శనమిస్తూ ప్రవక్తలు, మహాత్ములు మరణించి నప్పటికీ వారి మరణం సామాన్య జనుల మరణం వంటిది కాదని ఋజువు

పరచారు. ఆయన ఎప్పుడెప్పుడు ఎవరెవరికి భౌతికంగా దర్శనమిచ్చారో గుర్తు తెచ్చుకోవడం అవసరం.

హజరత్ తాజుద్దీన్ బాబా ప్రదర్శించిన అటువంటి లీలలలో అహమ్మద్ ఆలీషా అనుభవాన్ని చెప్పుకోవచ్చు. జీవించి వుండగానే సంకల్ప మాత్రాన రకరకాల వేషాలలో వివిధ ప్రదేశాలకు వెళ్ళగలిగిన శక్తిమంతునికి సమాధి అనంతరం అటువంటి లీలలు ప్రదర్శించడం ఏమంత కష్టం ! తాను 1,25,000 మంది మహాత్ములను తయారు చేసే వరకూ యీ ప్రపంచంతో సంబంధం కలిగి వుంటానని,ఆయన పిడికిలిని విచారణ దినం వరకు విప్పమనీ లక్షలాది సంవత్సరాలు మహారాజు రఘోజీరావ్ భవనంలోనే విశ్రమిస్తాననీ ఆయన ప్రకటించి వున్నారు. అందువలన భౌతిక కాయాన్ని పరిత్యజించిన అనంతరం కూడా ఆయన జీవించి వుంటారనే సంగతి వారికి ముందే తెలుసునని మనం గ్రహించవచ్చు.

అందుచేతనే బాబా తాజుద్దీన్ ఔలియా సత్యాన్వేషకులకు సరియైన బాట చూపడానికి తాము భౌతిక కాయంతో వున్నప్పటిలాగానే ఎప్పుడూ సిద్ధంగానే వున్నారు. ఒక్కొక్కసారి ఆయన లీలల ద్వారా, మరొకసారి భౌతిక రూపంలోనూ దర్శనమిచ్చి భక్తులకు తగిన సందేశాలను యిస్తూ ఉంటారు. ఆధునిక ప్రపంచం యిదంతానమ్మినా నమ్మకపోయినా ఆయనను నమ్ముకున్న భక్తులు మాత్రం చిక్కు సమస్యలలో అందరికీ ప్రభువైన దేవుణ్ణి వేడుకొని ఆయన అందించే సందేశాలను, ఆశీర్వచనాలనూ నమ్మకంతో స్వీకరిస్తారు.

## అధ్యాయము - 8

## మహాత్ముడు - ఆవశ్యకత

మనం యింతవరకూ తెలుసుకున్నట్లుగా హజరత్ తాజుద్దీన్ ఔలియా కాలాను గుణంగా అవతరించిన మహాత్ముడు. వివిధ ప్రపంచ ప్రజల మనుగడకు మతాలకు చెందిన ప్రజల మధ్య పరస్పర అవగాహన, సోదరభావం తప్పనిసరి అవుతున్న

పరిస్థితులలో తాజుద్దీన్ బాబా మన మధ్య అవతరించారు. అన్ని మతాలలో అవతరిం చిన మహాత్ములు మానవుల మధ్య సహకారం, ఐక్యతా భావం పెంపొందించడ మనే దైవకార్యమనే ఏకైక లక్ష్యం కోసమే పాటుపడ్డారు. తాజుద్దీన్ బాబా కూడా అటువంటి లక్ష్యసాధనకు కృషి చేసారని ఆయన జీవిత చరిత్రలోని అనేక సంఘటనలవల్ల మనం తెలుసుకోవచ్చు :

## భిన్నత్వంలో ఏకత్వం :

1920 సంవత్సరంలో ఉత్తరప్రదేశ్ నుంచి హజరత్ నియాజ్-బీస్-నియాజ్ అనే మహాత్ముని శిష్యుడైన కార్యకర్త ఒకరు కాంగ్రెస్ సమావేశాలలో పాల్గొనడానికి నాగపూర్ వచ్చారు. ఒక రోజున తాజుద్దీన్ బాబా తన గుఱ్ఱపు బండిలో నాగపూర్ వీధులలో తిరుగుతున్నారు. అసంఖ్యాక భక్తబృందం ఆయననుసరించి పోతున్నారు. వారిలో ఉత్తరప్రదేశ్ నుండి వచ్చిన కార్యకర్త కూడా వున్నారు. తన చుట్టూ వున్న గుంపులోని ఆ కార్యకర్తను చూడగానే తాజుద్దీన్ బాబా తన దగ్గర వున్న రొట్టెలోంచి కొంచెం ముక్కను త్రుంచి అతనికి ప్రసాదించారు. అయితే ఆ వ్యక్తి బాబా యిచ్చిన ప్రసాదాన్ని స్వీకరించడానికి సంకోచాన్ని ప్రదర్శిస్తూ, "నేను ఏదైనా స్వీకరిస్తే నా గురువు వద్ద నుండే స్వీకరిస్తాను. మరొకరి వద్ద ఎందుకు తీసుకోవాలి"? అనుకున్నాడు. వెంటనే బాబా, "ద్వైత భావాన్ని అద్వైతం జేయటం నీకు తెలియదా?" అని అడిగారు. ఆ కార్యకర్త మనసులోని సంకోచం మాయమై వినయంతో బాబా పాదాలకు ప్రణమిల్లాడు. ఈ సంఘటన భగవాన్ శ్రీ రమణ మహర్షి చెప్పిన యీ క్రింది వాక్యాన్ని గుర్తుకు తెస్తుంది - "పూర్ణ స్థితిని పొందిన మహాత్ములందరూ అంతటా వ్యాపించి వున్న చైతన్యస్థితే తాము అవడం వల్ల ఒకరి నుండి ఒకరు వేరు కాజాలరు".

## తాజుద్దీన్ బాబా పట్ల పార్శీ మహాత్ముని గౌరవం :

ప్రఖ్యాతి వహించిన పార్శీ మహాత్ముడైన మెహర్ బాబా 1913-14 ప్రాంతంలో పూనా నగరంలో బాబా జాన్ అనే సన్యాసిని చేత అద్భుత రీతిన ఉపదేశం పొందిన మహానుభావుడు. ఆయన సాధనలో ఒక దశకు చేరుకున్న తర్వాత బాబాజాన్ ఆయనను వాకీ వెళ్ళి తాజుద్దీన్ బాబా సన్నిధిలో ఎక్కువ

కాలం గడపమని ఆదేశించింది. ఒకరోజున తాజుద్దీన్ బాబా మెహర్ బాబాతో, "కనులు మూసుకొని దేవుని వాక్యం దర్శించు"! అని ఉపదేశించారు. అందుకేనేమో మెహర్ బాబా తనజీవిత శేషాన్నంతా మౌనంలోనే గడిపారు.

1958 సంవత్సరంలో మెహర్‌బాబా మళ్ళీ నాగపూర్ దర్శించినప్పుడు మహారాజు రఘోజీరావ్ ఆయన ఆశీర్వచనాన్ని కోరాడు. అప్పుడు మెహర్‌బాబా, "నువ్వు యిదివరకే తాజుద్దీన్ బాబా ఆశీర్వచనాన్ని పొంది వున్నావు. ఇంకా నేను చేయవలసింది ఏమున్నది?" అని వ్రాసారు. తర్వాత ఆయన తాజుద్దీన్ బాబా మందిరానికి వెళ్ళి అక్కడ కొంత సేపు ధ్యానంలో కూర్చుండిపోయారు. తాజుద్దీన్ బాబా ముఖ్య శిష్యులలో ఒకరైన కరీం కూడా అక్కడకు వెళ్ళి, "మెహర్ బాబా, నా కోసం కూడా ప్రార్థించండి" అని మౌనంగా ప్రార్థించాడు. వెంటనే మెహర్ బాబా తాజుద్దీన్ బాబా చిత్రపటాన్ని చూపుతూ, "తాజుద్దీన్ బాబాను తన గుండె నిండా నింపుకున్న వాని కోసం ప్రత్యేకంగా నేనెలా ప్రార్థించేది?" అనే అర్థాన్ని స్ఫురించేటట్లు చేసారు. దీని వల్ల మెహర్ బాబాకు తాజుద్దీన్ బాబా పట్ల ఎంతటి శ్రద్ధాభక్తులున్నాయో మనము గ్రహించవచ్చు.

### నీలకంఠరావ్ :

మహారాష్ట్రకు చెందిన నీలకంఠరావ్ జబల్‌పూర్‌లో ఒక ఆఫీసులో ఉద్యోగి. ఆయన ప్రతిరోజూ తాజుద్దీన్ బాబా ఫోటో ముందు అగరువత్తులను వెలిగించి నమస్కరించేవారు. ఒక రోజు అతడు తీవ్రమైన ధ్యానంలో మునిగిపోయి తాజుద్దీన్ బాబా ఫోటోను, తన యింటిని, పరిసరాలనూ పూర్తిగా మరచిపోయాడు. వెంటనే అతని ముందు తాజుద్దీన్ బాబా ప్రత్యక్షమయ్యారు. 'హాల్' అనే స్థితిని పొందిన నీలకంఠరావ్ ఆనందపారవశ్యంలో బాహ్యప్రజ్ఞను కోల్పోయాడు. ఇంటిలోని వారందరూ ఆందోళనతో డాక్టరుకు కబురు పంపారు. అయితే నీలకంఠరావు మర్నాడు ఉదయానికి గాని స్పృహలోకి రాలేదు. 'హాల్' అనుభవం తాలూకు ఛాయలు అతని ముఖంలో స్పష్టంగా గోచరిస్తున్నాయి. ఆ స్థితిలో నీలకంఠరావు తాజుద్దీన్ బాబాను దర్శించి ఆయన సన్నిధిలో కొంతకాలం గడిపారు. ఒకరోజున తాజుద్దీన్ బాబా నీలకంఠరావును సాయి ఖేడా నివాసియైన (కేశవ్‌దాదాజీ) 'ధునీవాలా' అనే మరొక మహాత్ముని దర్శించమని పంపారు. ఆ మహాత్ముడు

హిందూ మత సాంప్రదాయానికి చెందిన సద్గురువు.

నీలకంఠరావ్‌తో బాటు కరీంబాబా గూడ సాయి ఖేదా బయలుదేరాడు. వారింకా ధునివాలాదాదా ఆశ్రమానికి చేరకముందే నీలకంఠరావు ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తూ యిలా పాడనారంభించాడు : "మహమ్మద్ ప్రవక్త శరణు పొందిన గమ్యం చేరుట తథ్యం. మార్గంతెలిసిన మహానుభావులే మనలను చేర్చును తీరం. సద్గురు కృపయను అమృతపానమే తెలియగజేయును సత్యం" వారిరువురూ సాయిఖేడా చేరగానే చుట్టూవున్న భక్తుల మధ్య ఎత్తైన వేదిక మీద కూర్చొని వున్న దాదాజీని చూచారు. ఆయన చుట్టూ గల భక్తులు, ఎంతటి వారి నైనా మార్చి వేయ గల దాదాజీ శక్తిని పొగడుతూ పాడుతున్నారు. దాదాజీని చూస్తూనే నీలకంఠరావు ఆనందంతో ముంగాళ్ళమీద నడుస్తూ ఆయనను సమీపించి, పారవశ్యంతో వూగుతూ ఆయన వున్న వేదికనెక్కి ఆయన ముందు సాష్టాంగపడి బిగ్గరగా 'తాజుద్దీన్ బాబా' అని అరిచాడు. దాదాజీ నవ్వుతూ, తాజుద్దీన్ బాబా ఒక కుండలో పడిపోయాడు. చేతనైతే నీవు బయటకు తీయి' అంటూ నీలకంఠరావు నోట్లో ఒక జిలేబీ ముక్కను పెట్టారు. ఆయన చెప్పిన మాటలలోనిభావం ఆధ్యాత్మిక పరిభాషతో పరిచయమున్న వారికి సులభగ్రాహ్యమే.

హృదయమనే కుండలో గల నిజాన్ని నీలకంఠరావు వివేకంతో తెలుసుకోవాలని ఆయన భావం. లేక నీలకంఠరావు దాదాజీలో తాజుద్దీన్ బాబా స్వరూపాన్ని చూచి ఆశ్చర్యంతో బిగ్గరగా "తాజుద్దీన్ బాబా" అని అరచి వుండాలి. అందువల్లనే దాదాజీ తాజుద్దీన్ బాబా అంటే ఆయన నామరూపాలు మాత్రమే కాదని, సకల సాధువుల రూపాలలో వున్న ఆత్మ ఒక్కటేనని తెలుసుకోమనీ హెచ్చరించారు.

తాజుద్దీన్ బాబాకు బాబాజాన్‌తోనూ, సాయిఖేడా నివాసియైన ధునీవాలా దాదాజీతోనూ వున్నటువంటి ఆధ్యాత్మిక సంబంధమే శ్రీ శిరిడీ సాయిబాబా, తాజుద్దీన్ బాబాల మధ్య గూడా వుండేది. "ఇప్పుడు ఆధ్వర్యమంతా తాజుద్దీన్ బాబా, అక్కడికి వెళ్ళండి" అని చెప్పి తన దగ్గరకు వచ్చిన కొందరు భక్తులను తాజుద్దీన్ బాబా దగ్గరకు శిరిడీ సాయిబాబా పంపుతుండేవారు. అలానే తాజుద్దీన్ బాబా గూడా ఎంతో మందిని వారి ఆధ్యాత్మికాభివృద్ధికై శిరిడీ సాయిబాబా వద్దకు పంపేవారు.

## శ్రీ ఉపాసనీ మహరాజ్ :

సాకోరి నివాసి, శ్రీ సాయిబాబా ముఖ్యశిష్యుడూ అయిన శ్రీ ఉపాసనీ బాబా తరచూ తాజుద్దీన్ బాబా దర్శనార్థం వాకీ, సకర్దరా సందర్శిస్తుండేవారు. తాజుద్దీన్ బాబాకు ఉపాసనీ మహరాజ్ అంటే అంతులేని అభిమానముండేది. తాజుద్దీన్ బాబా తన భక్తుడైన డా॥ పవనాస్కర్‌ను ఆధ్యాత్మిక శిక్షణ, ఆశీర్వచనాల కోసం శ్రీ ఉపాసనీ మహరాజ్ వద్దకు పంపారు. ఆ సంఘటన గురించి డా॥ దేశ్‌పాండే యిలా వ్రాసాడు. "డా॥ పవనాస్కర్ సామాన్యమైన మహిమలను చూచి అంత తేలికగా ఒకరి ముందు తలవంచే మనిషి కాదు. సాటిలేని ఆ ఫకీరు ప్రదర్శించిన అపూర్వ మహిమలను చూచి, ప్రేమ పూరితాలైనా ఆయన బోధనలను విని విజ్ఞానియైన ఆ డాక్టరు తాజుద్దీన్ బాబాకు పాదాక్రాంతుడైనాడు.

తాజుద్దీన్ బాబా ప్రోత్సాహంతో డా॥ పవనాస్కర్‌కు ఉపాసనీ బాబా యందు కూడా దృఢమైన భక్తి కుదిరింది. ఆయన ఉపాసనీ బాబాను గురువుగా అంగీకరించమని డా॥ పవనాస్కర్‌ను ఆదేశించారు. తాజుద్దీన్ బాబా చెప్పిన నిదర్శనాలన్నీ సాకోరీలో ఉపాసనీ మహరాజ్ వద్ద లభించడంతో డా॥ పవనాస్కర్‌కు ఉపాసనీ మహరాజ్ మీద గల సమ్మకం మరింత దృఢపడింది. మనం గుర్తించవలసిన విషయమేమిటంటే పాట్నా నివాసి పీర్ సాహెబ్ బ్రహ్మచారిబాబా, తాజుద్దీన్ బాబా, చివరిగా ఉపాసనీ మహరాజ్ – వీరందరూ కలసికట్టుగా డా॥ పవనాస్కర్ ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడ్డారు.

బెంగాల్‌కు చెందిన మహాత్ములు 'హరనాథ్‌కుసుమ్' తాజుద్దీన్ బాబా సమకాలికులు, ప్రముఖ మహమ్మదీయ మహాత్ములిద్దరిలో ఒకరు, అజ్మీర్ నివాసియైన 'వాజ్‌టూబ్‌కల్లోఖాడ్‌షా' కూడా తాజుద్దీన్ బాబా పైన ప్రేమ, గౌరవాలు కలిగి వుండేవారు. వారు తమ అనుచరులలో వందలాదిమందిని తాజుద్దీన్ బాబా ఆశీర్వచనం కోసం నాగపూర్ పంపిస్తూ వుండేవారు. ఈ విధంగా మహాత్ములందరూ జాతి, కుల, మత విచక్షణ లేకుండా సరియైన ఐకమత్యాన్ని, సోదరభావాన్ని, పెంపొందించడానికి కృషి చేస్తుండగా యీనాడు సమాజంలోని అనేక వర్గాల సంకుచిత వైఖరిలో దురభిమానాలను ఉసిగొల్పుతూ, పరస్పరమూ ఓర్పు, ప్రేమ లేకుండా ప్రవర్తిస్తున్నారనే విమర్శలు వినిపిస్తూ వుండడం విచారకరమే. ఇక్కడ

జ్ఞాపకం చేసుకోవలసిన విషయం మరొక్కటున్నది. శ్రీ శిరిడీ సాయిబాబా ఒకసారి, "మేము (సాయిబాబా) తాజుద్దీన్ బాబా, సాయి ఖేడా నివాసి ధునీవాలాదాదా, నాసిక్ నివాసి నరసింగ్ మహరాజ్, అక్కల్కోట స్వామిసమర్థులు, షేగాం నివాసి గజానన్ మహరాజ్ – మేమందరమూ దత్తాత్రేయ అంశలతో అవతరించి, పరస్పర సహకారంతో ఒక లక్ష్య సాధనకు పాటుపడుతున్నాము" అని చెప్పారు.

ఇస్లాం మతస్థుడైనా – హిందూ మతస్థుడైనా ఏ వ్యక్తి అయినా సరే, క్రమశిక్షణలో పవిత్రమైన జీవితాన్ని గడుపుతూ, అందరికీ ప్రభువైన దేవునికి శరణాగతుడైనప్పుడు – ఆ భగవంతుడే ప్రేమతోను, అంతులేని దయతోనూ తనకు ప్రేమపాత్రులైన వారికి కొన్ని ఆధ్యాత్మిక శక్తులు ప్రసాదిస్తారు. మహాత్ములందరూ దేవునికి సన్నిహితులు. ఆదర్శప్రాయమైన వివిధ మత జీవితాలకు వారు చెరిగిపోని చిహ్నాలు. అటువంటి మహాత్ములే వారి మధ్య గల సంబంధాలతో సంకుచితమైన మత దురభిమానాలకు అతీతులై ప్రవర్తిస్తున్నప్పుడు వారి మతాలకే వారసులమైన మనం మాత్రం ఒకరినొకరం ద్వేషించుకోవడం ఎందుకు ?

## ప్రేమజ్యోతి

దైవం ప్రేమ స్వరూపం. నిరంతరభ్యాసం వల్ల మహాత్ములు తమ అహంకారాన్ని ఆ దైవమందు లయింపజేసి దైవ స్వరూపమైన ప్రేమతత్త్వమే వారుగా మూర్తీభవించి వుంటారు. అహంకారం సంపూర్ణంగా ఆయనయందే ఐక్యమైనప్పుడు అటువంటి మహాత్ముల కరుణ కూడా దైవం వలెనే నిత్యమై ఉంటుంది. "స్వర్గా రాజ్యమందలి నీ తండ్రి వలె నీవు కూడా నిర్మలుడవైయుండు" అని జీసస్ తన భక్తులకు చెప్పినందుకే, భగవంతుడు మానవుల పాప పుణ్యాలను పట్టించుకోకుండా ఎండను, వానను ప్రసాదిస్తాడు. ప్రవక్తలైన గౌతమబుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్ మొదలయిన వారి కరుణ కూడా అలాంటిదే. వివిధ మతాలలో అత్యుత్తమ స్థితులను పొందిన మహాత్ములందరూ సత్యంలోను, ప్రేమలోను ప్రవక్తలకు అతి సన్నిహితంగా పోలి వుంటారు. తాజుద్దీన్ బాబా అటువంటి స్థితినొందిన మహాత్ములలో ఒకరవడానికి సందేహమేమాత్రమూ లేదు. అందుకు నిరూపణలు చూద్దాం.

ఒక రోజున ఒక వేశ్య హుజూర్ తాజుద్దీన్ బాబాను ఆరాధించడానికి వచ్చి యీ విధంగా పాడింది :

"పుణ్య జీవులే వున్నారిక్కడ
పాపులు చేరే తీరమెక్కడ?"

ఇది విని తాజుద్దీన్ బాబా వెంటనే యిలా సమాధానమిచ్చారు. "మంచి వాళ్ళంతా అక్కడికే పొండి. పాపాత్ములంతా నా వెంతకు రండి" అన్నారు. ఎంతటి కరుణ !

మరొక సందర్భంలో తాజుద్దీన్ బాబా సకర్దరాలో ఒక దేవాలయాన్ని ఆనుకొని కూర్చున్నారు. వేలకొలది భక్తులు ఆయన చుట్టూ మూగారు. బాబా వారిని చూచి తన దృష్టిని ఆకాశం వైపు నిగిడ్చి ఇలా పలికారు : "ఓ దేవా ! వీరు చేసిన పాపాలన్నింటికీ సమాధానం వారి నడుగకుండా నన్నే అడుగు, ఎందుకంటే వారందరూ నాకుచెందినవారే !" తన భక్తుల పాపాలకు తానే బాధ్యత వహించడమంటే మన పట్ల వారికి ఎంతటి దయ వుండి వుండాలో గదా !

తాజుద్దీన్ బాబా గురువుగా తన శిష్యులను ఎంతటి సమర్థవంతంగా తీర్చి దిద్దేవారో అంతగానూ తమ భక్తులను కన్న తల్లికంటే ఎక్కువగా ప్రేమించేవారు. వారిని దేనికొరకూ ఎన్నడూ ఆయన దిగులు పడనివ్వలేదు. ఆయనకు సేవ చేసుకోవడము, రోగ నివారణ మొదలైన న్యాయమైన వారి కోర్కెలను ఆయన నెరవేరుస్తూ ఆధ్యాత్మికంగా వారిని ఉన్నతులను చేసారు.

ఒకసారి జలాలుద్దీన్‌ఖాన్ అనే భక్తుడు ఎంతో మంది తాజుద్దీన్ బాబా పాద సేవ చేస్తుండగా చూచి తనకట్టి అవకాశం లభించనందుకు తనను తాను తిట్టుకున్నాడు. వెంటనే తాజుద్దీన్ బాబా లేచి కూర్చొని, "నా సన్నిహితులెవరినీ నేను దురదృష్టవంతులుగా వుంచను, నేనెవరి శత్రువునుకాను" అన్నారు. జలాలుద్దీన్ యీ మాటలకు బిత్తరపోయి కృతజ్ఞతతో ఆయనకు నమస్కరించాడు.

సాహెబ్ బాబా అనే మరొక భక్తుడు ఖురాన్‌లోని సురాయా-ముజ్జమ్మిల్-సరకార్-ముజీమిల్ అనే వాక్యానికి అర్థం తనకు స్ఫురించేటట్లు తాజుద్దీన్ బాబా చేయాలని ప్రార్థించాడు. తాజుద్దీన్ బాబా నవ్వుతూ అతనితో, "అవును,

యిటువంటి అంధులు కూడా మనయెదుట చదువ్వగలుగుతారు" అంటూ తన భక్తులను చూపించారు. ఈ మాటలోని వారి భావమేమంటే ఖురాన్ చదువగల్గి నటువంటి పరిజ్ఞానం వారికి లేకపోయినప్పటికీ ఖురాన్ తత్వాన్ని బోధించినందు వలన, తన కరుణ వలనా, వారు శరీరభావాన్ని మరచి దేవుని యందే తమ దృష్టిని నిలువగలిగి వుంటారు. తాజుద్దీన్ బాబా మాటలకు స్వానుభవమే పుస్తక జ్ఞానము కంటే గొప్పదని, దానిని వారికి ఆయన ప్రసాదించారనీ అర్థం.

## అధ్యాయము - 9

## తాజుద్దీన్ బాబా దివ్యవాణి

సమర్థులైన మహాత్ములు వారి బోధనల యందే జీవిస్తారు, శ్రద్ధాళువులైన శిష్యులను ఆయన ఏమి బోధించారో ఈ అధ్యాయంలో మనం తెలుసుకుందాం:

1908 సంవత్సరంలో రాజా రఘోజీ మహరాజ్ హజరత్ తాజుద్దీన్ బాబాను సకర్దరా తెచ్చిన కొద్దికాలానికి ఒక సాధువు ఆయనను చూడడానికి వచ్చాడు. ఆ సాధువు మెడకు ఒక సంచి వ్రేలాడుతుంది. దాని నిండా చిన్న చిన్న మందుసీసాలు వున్నాయి. ఆ రోజుల్లో తాజుద్దీన్ బాబా ఎక్కువగా సమాధిస్థితిలో పారవశ్యంలో వుంటూ, బాహ్యప్రజ్ఞను కలిగినప్పుడు తన చుట్టూ మూగిన వేలాది భక్తుల ప్రశ్నలకు, ప్రార్థనలకు సమాధానాలిస్తుండేవారు. ఎంతో కష్టం మీద ఆయన కొద్ది నిమిషాలు మాత్రం బాహ్యప్రజ్ఞలో వుండి మళ్ళీ సమాధిలో మునిగి పోయేవారు. ఒక్కొక్కప్పుడు ఆయన తానున్న ప్రదేశాన్ని వదిలి దగ్గరలో వున్న పొలాల్లోను, అడవులలోను తిరుగుతూ ఉండేవారు. ఆ రోజుల్లో ఆ సాధువు తాజుద్దీన్ బాబాను దర్శించినప్పుడు బాబా అతనిని ఒక చిన్న గ్రామంలో నివసిస్తూ, ఇరవై నాలుగు గంటలూ (రోజంతా) దైవప్రార్థన చేసుకుంటూ, దైవం యొక్క సర్వవ్యాపకత్వాన్ని ఒక్కక్షణం కూడా మరచిపోకుండా వుండమని సలహా యిచ్చారు. తాజుద్దీన్ బాబా యింకా యిలా చెప్పారు : "దైవాన్ని తెలుసుకోవడానికి నిజమైన మార్గం మానవసేవయే. ఆ సేవా మార్గాన్నే నేను నీకు ప్రసాదించాను. సాధువులాగా దుస్తులు వేసుకొని పూజలు, నమాజులూ నోటితో ఉచ్చరించిన

మాత్రాన్నే దైవాన్ని పొందలేము. ఒక్క వ్యక్తి దుఃఖాన్ని తొలగించగల్గితే, నీవు చేసే ప్రతి యాత్రలోనూ వెయ్యి సార్లు హజ్, నమాజ్‌లు చేసినంత ఫలితం వస్తుంది." ఎందుకని? తన సేవతో ఎదుటి వ్యక్తి హృదయాన్ని జయించగల్గితే అంతకంటే పవిత్రమైన ప్రార్థనగాని, తీర్థయాత్రగాని నిజమైన భక్తునికి మరింకేమీ లేదు. ఎందువల్లనంటే కాబా (మక్కాలోని పవిత్రమైన ప్రదేశం) కంటే కూడా మానవ హృదయం వెయ్యి రెట్లు విలువైనది. ఆయన ప్రవచనాలు భగవద్గీతలోని వాక్యాలకు, ఖురాన్ షరీఫ్‌లోని వాక్యాలకు సరిగ్గా సరిపోతాయి.

1920 సంవత్సరంలో అరబ్బీ ఫకీరు ఒకాయన సకర్దరా వచ్చి బాబా ఆశీస్సులు పొందారు. ఆయన బాబా వద్దకు వచ్చిన సమయంలో రాజమందిర ప్రాంతంలో తాజుద్దీన్ బాబా అటూ,యిటూ వేగంగా తిరుగుతూ వున్నారు. బాబా అలా తిరుగుతూ వుంటే ఆ అరబ్బీ ఫకీరు ఆయనను సమీపించడానికి తగిన అవకాశం కోసం ఎదురుచూస్తూ బాబాకు కొంచెం వెనకాలే ప్రవక్త మహమ్మదుల వారి స్తుతియైన దారూష్ షరీఫ్ మెల్లగా చదువుతూ తిరుగుచున్నాడు. హఠాత్తుగా తాజుద్దీన్ బాబా వెనుకకు తిరిగి అతనికిలా చెప్పారు : "కోరికలను అదుపులో వుంచు, అప్పుడే దైవాన్ని చేరే బాటలో సాగిపోవడానికి వెలుగు కనిపిస్తుంది. వ్యామోహమువలన, అస్థిరమైన కోరికల వలన కష్టము, దుఃఖమూ సంభవిస్తుంటుంది. అటువంటి వ్యామోహము లేకపోతే ఆనందమే ఆనందం".

మరొకచోట బాబా అతనితో యిలా చెప్పారు : "మానవుడొక్కడే నిజానికి కోరికలని, కోపాన్ని జయించగల సమర్థుడు, ఈ రెండూ బలమైన శత్రువులు. కోపము, స్త్రీ వ్యామోహము మనిషిని అంధుడిని చేస్తాయి. ఆధ్యాత్మిక మార్గంలో దైవాన్ని చేరడానికి ఈ రెండు శత్రువులను జయించడం తప్ప సాధకునిగా మరో మార్గం లేదు."

తాజుద్దీన్ బాబా ఎంతో మంది సాధువులకు, ఫకీర్లకు యిటువంటి అనేక సూచనలిచ్చారు. ఆయనను దర్శించి సందేశాలను పొందిన ఆ కాలపు ప్రజలంతా అదృష్టవంతులు. బాబా తనకు ఏ విధంగా సందేశమిచ్చినదీ కరీమ్ బాబా యిలాచెప్పారు :

"ఝాన్సీ నుండి ఒక సాధువు బాబా సాహెబ్ దర్శనార్థమై సకర్దరా వచ్చారు. ఆ సాధువు తాజుద్దీన్ బాబా దగ్గరే వుంటూ వుండేవారు. ఒకసారి నేను సాధువును ముక్తి పొందడానికి ఏదైనా సులభ మార్గాన్ని చూపగలడేమోనని అడిగాను. అతను నన్నొక స్మశానములో కూర్చొని 'తాజుద్దీన్, తాజుద్దీన్' అంటూ తాజుద్దీన్ బాబా సాహెబ్ పేరును జపించమని చెప్పాడు. ఆ పద్ధతిలోనాకు ఆసక్తి కలిగి నేను స్మశానానికి వెళ్ళి రాసాగాను. మూడవ రోజున నేను స్మశానంలో వుండగా బాబా కోపంగాపిలుస్తున్నట్లు వినిపించింది. నేను కళ్ళు తెరచి చూచేసరికి అక్కడ ఎవరూ కనిపించలేదు. మళ్ళీ నేను కన్నులు మూసుకొని జపించడం ప్రారంభించాను, మళ్ళీ అటువంటి శబ్దమే వినిపించింది. అందుచేత నేను జపం చాలించి సకర్దరాకు తెల్లవారుజామున 3 గం॥కు చేరాను. అప్పుడు బాబా నా కుటీరం వద్దనే నిలబడి ఉన్నారు. నేనాయనను సమీపించగానే ఆయన నాతో, "పెద్ద పెద్ద కొండలను త్రవ్వి తీయమని నీకెవడు చెప్పాడు" అన్నారు. తర్వాత నాకొక అగ్గిపెట్టె యిస్తూ, "ఈ గడప, ఆ గడప తిరగడమెందుకు?" అంటూ యింకా మరికొన్ని మాటలుచెప్పారు. అయితే నాకవి అర్థం కాలేదు,అప్పుడు నేను మిమ్మల్ని అర్థం చేసుకోలేకుండా వున్నాను హుజూర్ ! నేను మిమ్మల్ని అర్థం చేసుకోలేకుండా వున్నాను. ఈ మాటలను నా మనస్సులో అనుకున్న వెంటనే నా చెంప మీద కొట్టి అన్నారు : "తెలియనితనాన్ని నటిస్తా వెందుకు"? తర్వాత ఆయన తమ ప్రక్కనే నిలబడి వున్న ఒక వ్యక్తి వద్ద నుంచి శాలువనొక దానిని తీసుకొని, దాని ఒకచివర నాచేతికిచ్చిరెండవ వైపు తాను పట్టుకొని నన్ను క్రిందపరచమన్నారు. శాలువ క్రింద పరచాక, 'ఇదే మన అంగడి' అంటూ యీ క్రింది గేయం చదివారు :

'ఈ దివ్య జ్ఞానపు అంగడి నా చేత తెరువబడింది.
తీసుకువెళితే ఎంతో కొంత, చేరగలరు దైవం చెంత'

ఆయన ఇంకా యిలా అన్నారు.

'అద్దంలో నా ముఖబింబం, హృదయంలో నీ ప్రతిబింబం
అద్దం వున్నది నా చెంత, నా హృదయం వున్నది నీ చెంత'
"కనులు మూసి వెతకినంత, కనిపించును హృదయమంతా

స్వచ్ఛమైన స్ఫటికమువలె నిర్మలమౌదైవమూర్తి"?

"పడుతూ లేస్తూ తలుపు తడుతూ, నిలబడలేక వెతుకుటెందుకు?

నువ్వు మోసుకపోయే ఫలకంలో నీ ప్రేమమూర్తి వున్నది చూడు!"

"మట్టిని సృష్టించావు, నీవే మనిషిని సృష్టించావు,
మనిషిని చేసిన మట్టి మూతను, నీవు సృజియించావు"
"ముంతనుకొన్నాడు. దానితో నీటిని త్రాగాడు.
ముంతకు పట్టుకు నేలకొట్టిన మనిసిని నీవే సృష్టించావు"

"ఆత్మావలోకనంచేసి తానెవరో తెలుసుకొని అంతటితో ఆగక తాను పరిపూర్ణత చెందే వరకూ సత్యజ్ఞానాల కోసం అన్వేషిస్తాడు. వాడు భగవంతుని తెలుసుకుంటాడు".

మరొకసారి ఆయన యిలా అన్నారు :

"నీకు దేవుణ్ణి చూడాలనివుంటే నిన్ను నీవు తెలుసుకోవడం ఒకటే మార్గం". తాజుద్దీన్ బాబా తన భక్తులకు శిష్యులకు ఎల్లప్పుడూ ప్రాణాయామం చేయమని చెప్పేవారు. ఇంకా ఆయన భక్తిలోను, యోగం లోనూ తేలికైన పద్ధతులను నేర్పే వారు, "మనోనేత్రం ముందు గురువు యొక్క రూపాన్ని నిలుపుకొని, ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో భగవంతుని నామాన్ని జపించండి"

'నీ కోరికలన్నింటినీ గురువు పాదాల చెంత సమర్పణ చేసి నిజమైన విశ్వాసంతో నీ గురువును ఆశ్రయిస్తే తప్పక భగవంతుని మహమ్మద్ ప్రవక్తల వారిని నిస్సందేహంగా పొందుతారని తెలుసుకోండి. కారణం, ఈ దృశ్యాదృశ్య ప్రపంచంలో రెప్పపాటులో సద్గురువు ప్రసాదించలేనిది ఏమీ లేదు' అనేవారు. దీనికాధారంగా యీ తత్వాన్ని చదివే వారు :

"ఎప్పుడూ భగవంతుని ఎడబాటుకు పరితాపం చెందుతూ యీ ప్రపంచంలో జీవించి, భగవంతుని యందలి భక్తి చెంత యీ ప్రపంచాన్ని విడవడమే నిజమైన ప్రాణత్యాగం"

"నిన్నే చూస్తూ, నిన్నే తలుస్తూ, నీ యందలి ప్రేమతో తన వునికిని మరచిపోవడమే నిజమైన షరీయత్, మారిఫత్ మరియు 'ఆహ్లేతరీకత్".

"మీ రూపాన్ని మనోనేత్రం ముందు నిలిపి ప్రతిశ్వాసతో మిమ్ములను గుర్తుంచుకోవడమే నిజమైన భక్తి."

"పక్షి గుడ్ల మీద కూర్చున్నట్లు నీ హృదయం మీద అధిష్ఠించు, ఈ అభ్యాసం నిన్ను పూర్తిగా మార్చి వేసి అద్భుతమైన అనుభూతలను ప్రసాదించగలదు".

"సుఖదుఃఖాలలో స్థయిర్యాన్ని నిలుపుకొనేవారిని కూర్చిన ప్రశంస ఖురాన్, షరీఫ్‌లో వున్నది".

"నేను సుఖానికి పొంగను, దుఃఖానికి కృంగను, సుఖదుఃఖ సమయాలు అతిథులవలె వచ్చి కొద్దిసేపుండి వెళ్లిపోయేవే అనే మనస్థయిర్యం నాకు కలదు".

"సుఖాపేక్షను పూర్తిగా విసర్జించడమే ఫకీరుకు నిజమైన మార్గం. ఈ విధంగా భగవంతుని పాదాలయందు ఆత్మార్పణ చేసుకొని ఆయన యిచ్ఛపై ఆధారపడితే ఆయన సర్వవిధములా నిన్ను కాపాడి యిహపరాలలోని సర్వాన్నీ నీవు కోరినా, కోరకున్నా నీకు ప్రసాదిస్తారు."

సంపూర్ణము

**తాజుద్దీన్ బాబా సమాధికి రైలు మార్గం :** మద్రాసు నుండి ఢిల్లీ వెళ్ళే దారిలోనాగపూర్‌లో దిగి అక్కడ నుండి వాకీ, సకర్దరాలలో బాబా సమాధిని దర్శించవచ్చు.

# శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా దివ్య చరిత్ర

## పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



1938 October 30న పవిత్ర సాంప్రదాయక కుటుంబంలో శ్రీమాన్ అనంతాచార్య-శ్రీమతి బుచ్చమ్మ పుణ్యదంపతులకు నాలుగవ సంతానంగా జన్మించారు పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ. తండ్రిగారి ఆదర్శ పెంపకంలో యోగాభ్యాసం నేర్చిన భరద్వాజులు గుడ్డినమ్మకానికి తావీయని రీతిన సత్యాన్వేషణతత్పరత కలిగి ఉండేవారు. వీరి చిన్నతనంలో సంభవించిన దుర్ఘటన కారణంగా జీవము, దైవము, మరణము, కాలము మొదలైన అంశాలపై వారికి ఉదయించిన అనేక ప్రశ్నలను అన్వేషిస్తూ సుదీర్ఘ యోచనలో 6 సంవత్సరాలు గడిపి చివరకు ప్రశ్నలే లేని అద్భుత ఆధ్యాత్మిక స్థితిని పొందారు. అన్ని ప్రశ్నలు సమాధానపడి చక్కటి సమన్వయం కుదిరింది. దైవం యొక్క ఉనికి నిర్ధారణ అయ్యింది. కొద్ది సం॥లు తరువాత శిరిడీ మొదట దర్శనంలో శ్రీ సాయినాథుని సమాధిమందిరంలో వారికి బ్రహ్మానుభూతి కలిగింది. అప్పటినుండీ శ్రీ సాయినాథుని గూర్చి అనేక ఉపన్యాసాలు, ప్రసంగాలు చేసి, గ్రంథాలు రచించి సాయిధర్మ ప్రచారానికి అంకితమయ్యారు శ్రీ భరద్వాజులు. సమకాలీనులైన అనేక మహనీయుల ఆదరణ ప్రశంసలు అందుకున్న ఆచార్య భరద్వాజ 1989 April 12వ తారీకున తమ భౌతిక శరీరాన్ని చాలించారు. కానీ నేటికీ తాము నిత్యసత్యులుగా, పిలిచిన పలికే దైవముగా నిలిచి భక్తులకు అనేక అనుభవాలు భౌతిక సాక్షాత్కారాలు సైతం ప్రసాదించి ఇహపర శ్రేయస్సు ప్రసాదిస్తున్నారు. "మాస్టర్"గా, "ఆచార్యులు"గా ఎందరో భక్తులప్రార్థనలనందుకొని అనుగ్రహిస్తున్నారు.

శ్రీ గురుపాదుకా పబ్లికేషన్స్

SRI GURUPADUKA PUBLICATIONS,
C/O SRI MANGA BHARADWAJA TRUST,
'BHAKTA NIVAS', 12-1-170/46P, HANUMAN NAGAR, JAIPURI COLONY,
NAGOLE, HYDERABAD -68, ANDHRA PRADESH, INDIA